'వెళ్ళిన రోజున అప్పటికి మా ప్రిన్సిపాల్ అయిన సైప్సుదొర వచ్చి నన్ను చూచి—హల్లో మిస్టరు మునిమాణిక్యం హౌ-డు-యు-డు? (How do you do?) అన్నాడు. కులాసాగా ఉన్నారా అని ఆ మాటలకు అర్థము.

'దొరగారే స్వయంగా నా సంగతి అడిగినందుకు నేను సంతోషించి "కొంచెము కులాసా యిచ్చిండండీ. కాని నా జబ్బు పూర్తిగా తగ్గలేదు. ఇంకా కాలువాపు అల్లాగనే వున్నది. జ్వరం మటుకు రావటంలేదు. అయితే జీర్ణశక్తి బొత్తిగా చెడిపోయింది" అని యేమో చెప్పాను.

'దొరగారు నేను చెప్పిందంతా ఓపికగా విని చివరకు మిస్టర్ మునిమాణిక్యం ఇదంతా చెప్పడం మర్యాద కాదు. నేను "హౌ-డు-యు-డు" అని అడిగినప్పుడు నీవు "థ్యాంక్యూ, నేను ఆరోగ్యంగానే ఉన్నాను" అనవలె. నీ జబ్బును గూర్చి ఎక్కువగా అడిగితే చెప్పవలెనే కాని లేకపోతే ఊరుకోవడమే మర్యాద అని నాకు హితవు చెప్పినాడు అప్పుడు తెలిసింది నాకు ఈ విషయం.'—ఇలాంటి చిన్న చిన్న సంఘటనలు ఆద్యంతం గ్రంథంనిండా ఎన్నోవున్నాయి.

తెలుగువాళ్లు దురుసుగా మాట్లాడతారని పలువురు అంటూవుంటారు. ఇతరులు అనటమేకాదు. మనం అలా మాట్లాడుతాంకూడా. మాట పొందికను అలవరచుకోవటానికి ప్రతిఒక్కరూ యీ గ్రంథాన్ని చదువవలసివుంది. పాఠశాలలలోకూడా 'మోరల్ రీడర్' లో విద్యార్థులచేత చదివించవలసిన ప్రయోజనకరమైన గ్రంథం. కావ్యం కాకపోయినా శ్రేయోదాయకమైనది.

## జానకీ-శర్మ

కథల సంపుటి; రచన: శ్రీ మునిమాణిక్యం నరసింహారావు. ప్రచురణ: దేశికవితా మండలి, విజయవాడ 2

కాంతం కథలు జనానికి మొహం మొత్తుతున్నాయని తెలుసుకొని కాబోలు శ్రీ నరసింహారావుగారు, జానకీ-శర్మ అనే పేరుతో తిరిగి కథలు వ్రాయటానికి ఉపక్రమించారు. కాని ధోరణిలోమాత్రం చెప్పుకోదగిన మార్పేమీ కనుపించదు. ఈ గ్రంథంలో 'శర్మ కాఫీతాగాడు' 'ప్రకరణభంగం,' 'శర్మ జానకిని ముద్దు పెట్టుకొన్న ఘట్టం' 'ప్రతిజ్ఞాపాలనం', అనే నాలుగు కథలున్నాయి. ఇందులో కొంచెం బాగా వున్నదని చెప్పటానికి వీలుగా వున్న మొదటి కథలోనే ఒకచోట ఇలా వ్రాశారు.

'తరువాత
ఆ పిల్ల అటునుంచీ
శర్మ ఇటునుంచీ
ఒకరికి దగ్గరగా ఒకరు
జరిగి, జరిగి
సమీపించి సమీపించి
ఒకరు నొకరు కౌగలించుకొన్నారు'

ఈ రకం 'ఆబ' ఈ రచనలలో సర్వత్రా వెళ్ళబోశారు. పై వాక్యాన్ని అలా 7 తుండాలుగా ఖండించి అరపేజీ జాగాలో ముద్రించారు. ప్రయోజనమేమిటో భగవంతునికి తెలియాలి.

ఈ రచనలలో హాస్యాన్ని సృష్టించటానికి శ్రీ నరసింహారావుగారు పడే యమయాతన మాత్రం మనకు నిజంగా జాలికలుగుతుంది.

ఈ దిగువ వాక్యాన్ని చిత్తగించండి.

"శర్మ జానకిని ఒక కన్నుతోమాత్రం చూస్తూ ఈ కన్ను మూసి ఆ కన్నుతోనూ, ఆ కన్ను మూసి ఈ కన్నుతో నూ చూచి చివరకు రెండు కళ్లు మూసికొని కూర్చున్నాడు"

పై వాక్యం పాఠకులకు ఎలావుందో గాని, భావించి మాధురీసర్వస్వం చేయవలసిన మహా వాక్యంగా శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు తాము యీ గ్రంథానికి రచించిన 'భూమిక'లో ఉటంకించారు.

శ్రీ నరసింహారావుగారి రచనలో కనుపించుతున్న మరో ప్రకృతివైచిత్రి యేమిటంటే ఉండుండి సంస్కృతశ్లోకాలను ఉటంకించటం. పాండిత్యం వున్నప్పుడు ప్రదర్శించటంలో దోషం లేదనుకొందాం- అయినా దానికి తగినంత తగిన అవకాశం లభించాలి. అంతేగాని ఏదో శ్లోకం దొరికిందిగదా అని దానికోసం కథను మళ్లితిప్పుకు రావటానికి ప్రయత్నించటం ఆరోగ్యకరమైన సంగతి కాదు.

అన్నిటినీ మించి శ్రీ నరసింహారావుగారు, మహామహులైన ప్రాచీనాలంకారికులను వేళాకోళం